# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 రాజమహేంద్రవరము 1-12-1977 సంచిక 3





1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# భారతము : ప్రాణబంధువు

— మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

మంత్ర హ్రదాత్ కథాకుల్యా । విద్యాకేదార మాశ్రితా ।
మోక్షశ్రియః ప్రసూః మధ్యే । పీయతే కర్మమార్గగైః ॥

మంత్రమనఁగా వేదము. వేదము హ్రదము. వేదహ్రదమునుండి కథాకుల్య ప్రవహించినది. ఆ కాల్వనీరు విద్యాకేదారమును తడుపుచున్నది. మోక్షలక్ష్మి అక్కడ పండెడి పంట. ఆ కాల్వనీటితో కర్మపథానుయాయులు నడుమ దప్పి తీర్చుకొనుచున్నారు. ఆనీరు వారిదప్పికకు ఏర్పడి పాఱుచున్నది కాదు. వారి తృష్ణానివారణము ఆకాల్వకు ఆనుషంగికము. మఱి, తత్ప్రవాహలక్ష్యము విద్యాక్షేత్రమును తడుపుట. ముక్తి సస్యమును పండించుట.

భారతవర్షమున – సర్వప్రపంచమున – అధికార తారతమ్యముతో మహాభారత పారాయణము సాగుచున్నది. ప్రవృత్తి సాధకముగా నొకఁడు, నివృత్తిబోధకముగా నొకఁడు తాత్పర్యము కలిగియున్నారు. అభినవ సరణిలో దానిని పురాణించుచున్నారు. పురాణఫక్కిలో దానికి క్రొత్తవక్కాణములు చేయుచున్నారు. మహాభారత మనఁగా, ఇరువయిపుల పదనుగల చుఱకత్తి.

తత్త్వతః, వేదగోక్షీరము చిలికి తీసిన నవనీత ఖండము భారతఖండము. ఈ వెన్నముద్దలో సంగోరు గోరుముద్దలుగా ఆతల్లి యశోద కిశోరకృష్ణునకు తినిపించినది. ఆ బలముతో ఒడలుచేసిన కృష్ణుఁడు దడిదేఱి పార్థునకు సారథ్యము నడపినాఁడు. అతనికి తన విశ్వరూపమును సిద్ధసాధనముగా చూపినాడు. మహాభారతము ప్రవృత్తిని ఊదుకొని, నివృత్తిని ఆదుకొని యున్నది. నాఁడును ఏనాఁడును అది నివురుగప్పిన నిప్పు.

మహాభారతాంతర్గత జ్యోతిర్మండల మధ్యవర్తియై వెలుఁగని 'గీత' యొకటి యున్నది. అదిగోచరమైన వానికి మాయ నష్టప్రాయము. కానివానికి, అదితెలిసికొనుటకు భారతముకంటె మించిన గతిలేదు. అంతకు దాటిన జగద్భాష్యము వేఱొకటిలేదు. అలేఖ్యమైన ఆమ్నాయ తత్త్వము నోటఁబెట్టరాని చేఁదుమందు. ఆమందునకు లోకవ్యాఖ్యామాక్షికము ననుపానముచేసి భవరోగులకు ఒంటబట్టించుటకు యత్నించిన ఋషిభిషగర్యుఁడు వ్యాసులవారు. వారి యడుగుజాడలనుండి ఆచార్య శంకర భగవత్పాదులు జగభ్యుదయ నిశ్శ్రేయస కాంక్షతో గణాధిపతి గంటమునకు పసిఁడిగంట లలంకరించిరి.

భగవద్గీత – సనత్సుజాతీయము–విష్ణుసహస్రము – ఈమూడుఘట్టములు ఆచార్య భాష్యములతో నేడు శాణోల్లీఢమణులుగా దీపించుచున్నవి.

ఇతరము లెన్నియున్నను, సంధ్యాత్రయమువలె అనంతకాలగ్రంథులగు మహోత్తమ గ్రంథములు మనకు మూఁడేమూఁడు. అవి యందఱకు ప్రాణబంధువులు. భారత భాగవత రామాయణములు. రామాయణము త్రేతలోనిది. భారతము ద్వాపరములోనిది. యుగముల హద్దుపద్దులు లేవు. యుగయుగములకు ఈమూడే చాలియున్నవి.

రామాయణమున మానవదానవుల ధర్మాధర్మములకు జరగిన పోరాటము చూచితిమి. విగుణమునకు వినాశముతప్పదు. విభీషణుఁడు జాతితః దానవుఁడు. అయిననేమి! అతనిది దైవోన్ముఖమైన మానవధర్మముకల హృదయము. రావణ వధానంతరము రాక్షసరాజ్యమున అతనికే అభిషేకము జరగెను. సుగ్రీవుఁడు వానరుఁడు. అగుఁగాక! అతనిలో తరంగితమైన మానవోత్తర ధర్మము వాలివెనుక కిష్కింధకు ఏలికనుగా చేసినది. వానరులకు వానరుఁడే పాలకుఁడు. దానవులకు దానవుఁడే ఏలిక. ఇట్టిధర్మము శ్రీరాముని రాచఱికములో నిలబడినది. అటు దానవప్రభువునకు, ఇటు వానరప్రభువునకు మనుస్మృతియే ప్రమాణము కావలయును. సుగ్రీవ విభీషణులు రాముని ధర్మనికషమున గీటువచ్చినవారు. దానవ వానర పాలకులలో మానవధర్మమే అపరిహరణీయమై యున్నది. పరదారాపహరణ మన్నదోషము సర్వత్ర భ్రంశకారణ మని తెలియఁ జెప్పినది.

రామాయణములోని రావణ వాలులకుఁ గొంత సమీపముగా భారతమునందలి దుర్యోధనాది జీవులకు ధర్మేతరలక్షణములు పట్టినవి. ధర్మాభిరామమైన శ్రీకృష్ణుని రాజ్యతంత్ర సుదర్శనము ఒక్కసారి పరిభ్రమణము చేసినది. లీల వనమాలిది కాఁగా, యశోమాల పార్థుని మెడలో వచ్చిపడినది.

మహాభారతగాథ మనకు సన్నికృష్టమైన యుగములో జరగినది. మానవకుటుంబమున తటస్థించిన పోరాట మగుటచే ఎల్లరకు మఱియు దగ్గఱగా ననుభూయమానమగు గాథ. భారత జాతీయ కుటుంబ మిట్టిదా, యనుకొనుచు చదువుకొనుచు నెమరు వేయుచున్న గాథ. అందులో, తెలుగువారి జీవితానుభూతులకు వారి మనఃప్రవృత్తులకు, వారి మాటతీరులకు చేతలకు వంతులువచ్చు గాథ.

వేదవ్యాసులవారి పురాణోపపురాణములలో సర్వోత్తరసారమై భారతమహాప్రాణ మొకడు మనలో సంచారము చేయుచున్నది. ఉపనిషత్తులలోని అధ్యాత్మవిద్యనుండి సాహిత్యములోని ఖండకావ్యములవఱకు దురవగాహమైన వ్యాసఘట్టము నుండి, ఆబాలగోపాల మానందపడు పిట్టకథలవఱకు మహాభారతము ప్రాణబంధువుగా విశ్వరూప ప్రదర్శనముచేసి చూడుమనుచున్నది. పార్థక్యము విడిచిన పార్థత్వము రావలయును.

# ఈనాటి నాటక సమాజాలు - సామాజికులు

— గాదేపల్లి కుక్కుటేశ్వరరావు, ఎం. ఏ.

ఈనాడు మనం 'ప్రేక్షకులు' అని సామాన్యంగా వ్యవహరించే పదాన్నే మన ప్రాచీనాలంకారికులు 'సామాజికులు' అని వ్యవహరించారు. నాట్యకర్తయైన భరత ముని కాలం ఇదమిత్థంగా నిర్ణయించడం అసాధ్యంగానే మిగిలిపోయింది. ఆ మహర్షి నాట్యవేదాన్ని వ్రాయకపూర్వమే 'నాటకం' అనే ఒక కళాప్రక్రియ బహుప్రచారంలో ఉండి సామాజికుల ఆదరణపొందుతూ ఉండేదన్నమాట అతి యథార్థం. "సిద్ధిర్లోకాద్దృశ్యా" అన్నది ఒక్క వ్యాకరణానికే కాదు మరి ఏ శాస్త్రానికైనా మూలసూత్రమే.

ఒకరి రూపాన్ని మరొకరు ధరించి, రంగస్థలంమీద ప్రదర్శించే కావ్యానికి రూపకం అని పేరుపెట్టి, ఆప్రక్రియను బదివిధాలుగా వింగడించారు. అవి ఇవి: 1) నాటకము, 2) ప్రకరణము, 3) భాణము 4) డిమము 5) వ్యాయోగము 6) సమవాకారము, 7) ఈహామృగము, 8) ప్రహసనము, 9) వీథి, 10) అంకము.

రూపకంలో ప్రధానరసం, నాయకుడు, పాత్రలు, అంకసంఖ్య అనే విషయాలలో ఉండే భేదంవల్ల ఈ భేదాలు బయల్దేరినట్లు ఆలంకారికమతం. అంటే కొద్దిగానో గొప్పగానో ఈ పదివిధాల రూపకాలూ ప్రాచీనకాలంలో ఆడుతూ ఉండేవా రన్నమాట. మళ్ళీ అన్నిట్లోనూ 'నాటకం' అన్నది తలమానికం అయిన శాఖగా ఆదరణ పొంది ఉండడంబట్టి, దానికే దశవిధరూపకాల్లో అగ్రతాంబూలం ఇచ్చి గౌరవించడం జరగింది.

అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, నాగానందము, ఉత్తర రామచరిత్ర, ముద్రారాక్షసము మొదలైనవి సంస్కృత నాటకాల్లో అగ్రగణ్యాలు. సంస్కృత నాటకరచనా సంప్రదాయాన్ని సక్రమంగా అనుసరిస్తూ తెలుగులో వ్రాయబడ్డ నాటకాలు జనాదరణ పొందేఉన్నాయి. అవి: కురుక్షేత్రము, గయోపాఖ్యానము, సీతారామాంజనేయ యుద్ధము, సత్యహరిశ్చంద్ర, బొబ్బిలియుద్ధము, ప్రతాపరుద్రీయము, మొదలైనవి. ఈ పౌరాణిక చారిత్రక నాటకాలే కాకుండా ఈనాడు అసంఖ్యాకమైన నూతన సాంఘిక నాటకాలుకూడా తెలుగుదేశంలో ప్రదర్శింపబడుతూ ఉన్నాయి. ఈనాటకాలు వ్రాసిన, వ్రాస్తున్నవారిలో కీ.శే. గురజాడ, భమిడిపాటి, శ్రీయుతులు ఆత్రేయ, కొర్రపాటి గంగాధరరావు, భమిడిపాటి రాధాకృష్ణ, కప్పగంతుల మల్లికార్జునరావు, యన్. ఆర్. నంది, గణేశ్ పాత్రో, గొల్లపూడి మారుతీరావు, మొదలైనవారు సుప్రసిద్ధులు.

సాంప్రదాయిక నాటకాలను వేసే సమాజాలకు "...నాట్యమండలి" అనే పేరు అనూచానంగా వస్తున్నది. ఆధునిక నాటకాలు వేస్తున్నవారు వారి బృందానికి "...సమాజం" అని వ్యవహారనామం పెట్టుకోవడం కద్దు.

కురుక్షేత్రము మొదలైన సాంప్రదాయిక నాటకాల తత్వం ఇది :

ఇతివృత్తం :— సామాన్యంగా ప్రఖ్యాతం కావడంవల్ల సామాజికులకు కథా సన్నివేశ జ్ఞాన గ్రహణాదుల విషయంలో క్లేశం దాదాపు లేనట్లే.

పాత్రలు :— శ్రీకృష్ణుడు, భీముడు, అర్జునుడు మొదలైన పాత్రలు సామాజికుల జీవితంలో బాగా రంగరించుకు పోయినవి. లౌకికులైన శ్రీకృష్ణాదులు నిజానికి ఏనాడో నష్టశరీరులు. ఐనా సమాజంలో ఇరుగుపొరుగులవలె మనతోపాటు జీవిస్తూ ఉండే వ్యక్తులంత సన్నిహితంగా మనమనస్సులపై ముద్రవేసి కూర్చున్నారు.అంచేత, ఆ నాటకాలు చూస్తున్నప్పుడు ఆనందమే కలుగుతూ ఉంది. సామాజికునకు ప్రధానంగా కావలసింది రసానుభూతి. 'రసం' సామాజిక నిష్ఠం - అన్నది అంగీకృత సిద్ధాంతం. ఆవిషయం అట్లా ఉంచుదాం.

సంగీతం :— తెనుగుపద్యం గానంచెయ్యడానికి ఒక ప్రత్యేకమైన బాణీ ఉంది. శ్రీ, కల్యాణి, కమాచి, మోహన, శివరంజని, నాదనామక్రియ, కాఫీ, తోడీ, భూపాల- మొదలైన రాగాలు ఆయాసన్నివేశాలను(సాహిత్యం అర్థంగాకపోయినా) సామాజికులకు అవగాహనచేస్తూఉంటాయి. పద్యంలోఉన్న సాహిత్యం ఎంత సులభగ్రాహ్యంగా ఉంటే అంత రసవత్తరంగానూ ఉంటుంది ఆసన్నివేశం. సంభాషణల్లో వచనం, పద్యం, ఒకదానితో ఒకటి పోటీపడుతూ ఉంటాయి. పద్యాలపాలే ఎక్కువగా ఉంటుంది. పద్యాలు గానంచెయ్యడానికి కంఠస్వరం సుష్ఠుగా ఉండాలి. వాచికం నిర్దుష్టంగా ఉండాలి. ఆంగికాభినయం **(that which is generally called Action),** సముచితంగా ఉండాలి.

నేపథ్యం :— **(Settings)** ఆయారంగాలకు తగినట్లుగా తెరలు, దృశ్యకల్పనలు ఏర్పాటు చేయబడాలి.

ఏవంగుణ విశిష్టమైన పౌరాణిక నాటకాల - ఈనాటి స్థితినిగూర్చి కొంచెం యోచింపదగిఉంది. సామాన్యంగా ఇల్లాటి నాటకాలు ఏ గణపతి నవరాత్రుల్లోనో, దేవీనవరాత్రి ఉత్సవాల్లోనో తప్ప ఆడటం లేదు. సరియైన ప్రదర్శనశాలలు లేనికారణంగా అవి అక్షరాలా వీథినాటకాలే అవుతున్నాయి. జనసంచారం కొంచెం సద్దు

మణిగాక వీథులలోనే రంగస్థలాలు ఆవిర్భవిస్తున్నాయి. అందుచల రంగాలంకరణ బాగా దెబ్బతింటున్నది. సన్నివేశాన్ని మాచాయగా తెలియపరిచే వెనుక తెరలుతప్ప మరి యే యితర దృశ్యకల్పన జరగడంలేదు. మరీదుస్థితి ఏమిటంటే కొన్నిచోట్ల, కృష్ణుడు, దుర్యోధనుడు మొదలగువారు అధివసించే సింహాసనాలుకూడా 'గాడ్రెజ్ ఫైవ్ ఫోల్డింగ్' కుర్చీలే అవుతున్నాయి.

వేషధారణ :- పర్వాలేదు. పాటాలజోలికి పోకుండాఉంటే కొంత తృప్తి కరంగానే ఉంటున్నది. పోతే, పాత్రధారులు బాగా దమ్ముపట్టి రాగంతీసే చమత్కారం కలవారు అయిఉండాలి. అల్లాటివారే యీ రంగస్థలప్రవేశానికి అర్హులు. ఈ ప్రతిభలో చెప్పుకోదగ్గవారు కీ. శే. అబ్బూరి వరప్రసాదరావు, పులిపాక, శ్రీయుతులు పీసపాటి, బి. వి. రంగారావు, మల్లాది సూర్యనారాయణ, కందుకూరి చిరంజీవిరావు, మొదలైనవారు. కీ. శే. రఘురామయ్య, శ్రీ షణ్ముఖి ఆంజనేయరాజు మొదలైనవారికి రాగదృష్టి మెండు. రాగాలాపనలో ప్రత్యేక 'కళలు' నొక్కులు, విసరడం వీరి ప్రత్యేకత. సామాజికులను ఈ ఆలాపన ముగ్ధుల్ని చేస్తున్నది. పైని పేర్కొనబడ్డ శ్రీ పీసపాటి ప్రభృతులలో రాగాలాపన, సాహితీరస వ్యంజకతకు తగుమాత్రంగా ఉంటుంది. రాగాలాపన సందర్భంగా కొందరి నటులలో అవసరానికి మించిచేయి, తల, పెదవుల విసురులు కన్పిస్తూఉన్నాయి. ఇది సూక్ష్మజ్ఞులకు కొంచెం ఎబ్బెట్టుగా అన్పించక తప్పదు.

ఒకేపాత్రను ఇరువురు, ముగ్గురు, నలుగురుకూడా నటించడం (ఒకటవ కృష్ణుడు, రెండవ కృష్ణుడు...అంటూ) ఈనాడు చూస్తున్నాం. ఇది ఇటీవలవచ్చిన పద్ధతి. ఒకేపాత్రను సమర్థముగా నటించే యిద్దరు ముగ్గురు నటుల నటనను సామాజికులకు చూపించే అవకాశం కల్పించడమే యాజమాన్యాల లక్ష్యం. క్వచిత్తుగా 'కనకం' వంటి నటీమణులు శ్రీకృష్ణ (పురుష) పాత్రలు ధరించడంకూడా జరుగుతున్నది.

సాహిత్యం :- ఆపద్యాల్లో ఉండే సాహిత్యం 'పదపదం' సామాజికులకు అర్థంకాదు. వచనంకూడా గ్రాంథికమే. గ్రాంథికంలో మాట్లాడ్డం అన్నది తెలుగు జాతికి ప్రకృతివిరుద్ధం అన్నవిషయం వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ చెప్పుకొచ్చిన పౌరాణిక నాటకప్రదర్శన విషయంలో గుణదోషాలు లెక్కకడితే తేలే సారాంశం ఇది :

ఇతివృత్త గౌరవం, పాత్ర ప్రాధాన్యం, సంగీతం అన్నవి గుణాలు.

దెబ్బతిన్న రంగాలంకరణ, విపరీత రాగాలాపన, చేయి తల పెదవుల అనవసరపు విసురులూ, రంగాని కొక్కరుగా ఒకేపాత్ర పలువురు ధరించడం వంటివి దోషాలు

ఇక బొబ్బిలియుద్ధం వంటి చారిత్రక నాటకాలు పౌరాణిక నాటకాల మార్గం లోనే నడుస్తున్నాయి. అయినా పౌరాణిక నాటకా లంతగా సార్వకాలీన ప్రజాదర ణకు పాత్రంకాకుండా ఉన్నాయి. కారణం పౌరాణికపాత్రలు అనుదినస్మరణీయ భగవదంశ ప్రధానాలుగా ఉండటం, చారిత్రకపాత్రలు ఎంత ధర్మమార్గ ప్రతిష్ఠా పకములైనా మానవమాత్రులే అనే స్ఫురణ ప్రజల్లో ఉండడమే కావచ్చునేమో ! అది వేరేవిషయం. ఈ పౌరాణిక చారిత్రక నాటకాలు సక్రమంగావేస్తే, ముగిసేటప్ప టికి దాదాపు తెల్లవారుతూ ఉంటుంది. అంటే 6, 7 గంటలసేపు నాటకం ఆడడం జరుగుతుంది.

అత్యాధునికమైన పరిషత్తు నాటకాలు :- కొన్ని కళాపరిషత్తులు మంచి మంచి నాటకాలను, నాటికలను, రచయితలను, నటులను ప్రోత్సహించే సదు ద్దేశంతో అప్పుడప్పుడు పోటీలు నిర్వహిస్తూ ఉన్నాయి. ఇవి కేవల వచన నాటకాలు, నాటికలు. ఎక్కడైనా క్వచిత్తుగా ఓపాట ఉంటే ఉండవచ్చు; అంతమాత్రమే.

ఈవిధమైన నాటకాల ఆవిర్భావానికి గురజాడవారి కన్యాశుల్కం మొదట్లో బలాన్ని ఇచ్చిం దని చెప్పుకుంటూ ఉంటారు. తెలుగులో ఈనాడు విశ్శృంఖలవిహారం చేస్తున్న నవల, కథానిక, వచనగేయం వంటి ప్రక్రియలకు ఆంగ్లసాహిత్యపు తీరు తెన్నులే మార్గదర్శకా లైనట్లు, ఇల్లాటి నాటకరచనకుకూడా ఆధునిక ఆంగ్ల నాటక రంగం కారణ మనే చెప్పాలి. బెర్నార్డ్ షా నాటకాల్లోని అతి వాస్తవికమైన సమాజ సమస్యలూ పరిష్కారాలు - ఈ కోవకు చెందిన నాటకాలలో మనం చూస్తూ ఉన్నాము. ఆత్రేయగారి యన్. జీ. ఓ. ఒక అద్భుతసృష్టి. గుమాస్తాల ఇక్కట్లు, స్త్రీలకు జరిగే అన్యాయాలు, వ్యభిచార వ్యవస్థ, ఆఫీసులలో జరుగుతున్న అన్యా యాలూ, గ్రామాధికారులుచేస్తున్న దుండగాలు, నాగరికులుగా నటిస్తూ పట్టణాలలో వారూ వీరూ నడుపుతున్న దురంతాలు మొదలైనవన్నీ ఈ నాటకాలకు ఆధారమైన యితివృత్తాలు.

కాబట్టి యీనాటకాలు సమకాలీన సజీవసంఘానికి ప్రతిబింబాలు. ఇల్లాటి నాట కాల్లో ఉండే చమత్కార మంతా **'Suspence'** పై ఆధారపడి ఉంటుంది. అంటే ముం దేంజరుగుతుందా అన్న నిరీక్షణ. కథ ఓవిధంగా నడుస్తున్నట్లు కన్పి స్తుంది. అనుకోని మార్పు కథ మధ్యలోనో, అవసానంలోనో తళుక్కున మెరుస్తుంది. అంతవరకూ ఉన్న **suspence** తొలగిపోయి, సామాజికుని హృదయంలో ఒక చమత్కారం వెల్లివిరుస్తుంది. ఇది యీనాటకాల స్థూలస్వరూపం. కథను ఎన్ని మలు పులతో మలుచుకుంటే కవి అంత ప్రతిభావంతు డన్నమాట. ప్రాచీన నాటకాల్లో **suspence** ఉండదు; కథ యావత్తూ సామాజికునకు పరిచిత పూర్వమే కనుక,

మతి ఆనాటకాల్లో సామాజికుని ఆకట్టి నిల్పే దల్లా పాత్రలూ, సంగీతం. ఈ నవీన నాటకాలలో సంగీతానికి ప్రత్యక్షంగా తావు లేదు. అయితే చలనచిత్ర ప్రభావం బాగాపడ్డ మన నవీననాటకరంగం నేపథ్యవాద్యాలను చక్కగా వాడుకుంటున్నది. క్లారినెట్, తబ్లా, ప్రేలుడగట్టే లోహపురేకులు, గజ్జెలు, మొదలైనవాటి శబ్దాలను సంభాషణలతో మేళవించి effects తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదే సంగీత విభాగం.

ప్రాచీన నాటకాలకంటె ఈవిధమైన నాటకాలు అవగాహన చేసుకోవడం కష్టతరం. కథ పరిచితపూర్వం కాకపోవడం, మలుపులను జాగ్రత్తగా అవగాహన చేసుకోవలసిరావడం దీనికి కారణాలు.

సామాజికులు :– ప్రస్తుత సామాజికులను రెండు తెగలుగా విభజించవచ్చు. (1) పౌరాణిక నాటకప్రియులు (2) సాంఘిక నాటకప్రియులు. అంటే ఒక తెగవారు మరొక తెగ నాటకాలుచూడరు అనికాదు. అభిమానించే తెగపై 70శాతం మనస్సు ఉంటే మిగిలిన తెగమీద 30శాతం మనస్సు ఉన్నవాళ్లే. అభిమానంలో ఉన్న ఎక్కువ తక్కువల్ని బట్టి యీ వింగడింపు చేయవలసివచ్చింది.

పౌరాణిక నాటక ప్రియులు:– వీరిలో బాగాచదువుకొన్నవారు, ఓమాదిరిగా చదువుకొన్నవారు,చదువురాని పామరులుకూడా ఉన్నారు. ఈమూడుతరహాల సామాజికుల్నీ ఈనాటకాలు ఆకర్షిస్తూనే ఉన్నాయి. ఈనాటకాల్లో ఉన్న "వింత" అనేదే వారిని ఆకర్షిస్తున్నట్లు చెప్పవచ్చును. వింత అంటే సామాన్య స్థితికంటె భిన్నంగా ఉండేవ్యవస్థ.

వేషధారణ, సంభాషణ, సంగీతం, పాత్రలు అన్నవి నాలుగూ వింతలే. పౌరాణిక, చారిత్రక నాటకాల్లో పాత్రలు, ప్రస్తుతసామాన్య మానవునిలా వేషధారణ చేసుకోకుండా, కిరీటం, గద, గాండీవం, ఖడ్గం, ఆభరణ బాహుళ్యం మొదలైన పరికరముల సహాయంచేత రంగస్థలంమీద కన్పిస్తూ ఉంటాయి. ఇది మొదటి ఆకర్షణ.

సంభాషణ వ్యావహారిక భాషలో ఉండక గ్రాంథికభాషలో ఉంటుంది. చాలావరకు ఈసంభాషణలు పద్యరూపంలో ఉంటాయి. ఇదికూడా మనం వ్యవహరించుకునే దైనందిన సంభాషణ విధానానికంటె భిన్నమే. ఆ వింతభాషవినడం అన్నది ఒక కుతూహలం. పోనీ పద్యాలైతే, సంగీతసమున్మీలనం వల్ల సామాజికుల్ని ఆనందపరుస్తున్నవేమో అనుకుంటే,మయసభలో దుర్యోధనుని దీర్ఘసమాస వాగ్గుంఫన

కూడా వారిని రసముగ్ధుల్ని చేస్తున్నది. "చదువుకొన్న వారికైతే భావగ్రహణ శక్తి ఉండవచ్చు. మరి పామరుల విషయం ? కాబట్టి వింతసంభాషణసైతం సామాజికు లకు మనోరంజకంగా ఉన్నది, అనే భావించాలి.

సంగీతం సరేసరి. అది ఆపాతమధురం. చెవిలోపడగానే ఆనంద తన్మయుల్ని చేస్తున్న శ్రుతి రాగాలతో మేళవింపబడ్డ కంఠస్వరంనుండి వెల్వడే పద్యం లేకపాట ఆపామరపండితమైన సదస్సుకు ఆనందదాయి అవుతున్నది.

పాత్రలే ఒకవింత. అవిసామాన్య మానవపాత్రలుకావు. దైవీయమైనపాత్రలు. చారిత్రక పాత్రలైతే శౌర్యధైర్య- ఔదార్యాది ఉత్తమగుణాలతో కూడుకొన్నవి. ఈనాటికి కూడా పౌరాణిక నాటకాలంటే సామాజికులు టిక్కట్లు కొనుక్కొని, త్రోసుకుంటూవెళ్ళి, ప్రయాసపడి తెల్లవార్లూ కూర్చుని ఆనందిస్తూనే ఉన్నారు. మళ్ళీ ఈ నాలుగు వింతల్లోనూ 'సంగీతం' అనేదానికి అగ్రతాంబూలం ఇవ్వవచ్చు.

సాంఘిక నాటకప్రియులు:- వీరిలో బాగా చదువుకొన్నవారు, ఓమాదిరిగా చదువుకొన్నవారే ఎక్కువ. పామరసంఖ్య బహుస్వల్పం. ఈనాటకాలు పల్లెటూళ్ళల్లో బహిరంగంగా వేస్తున్నప్పుడు పామరజనం కూడావచ్చి చూస్తూనేఉంటారు. అయితే పౌరాణిక నాటకాలకువలె తెల్లవార్లూ పామరజనం ఈనాటకాలతో ఆనందించ లేరు. అందుచేత మొదటిరెండు వర్గాలవారికైతే యీనాటకాలు బాగా ఆనందదాయ కంగా ఉన్నా యని గట్టిగా చెప్పవచ్చు. నాకు తెలిసినంతవరకు 'రక్తకన్నీరు' తప్ప టిక్కట్లుకొనిపించి నెగ్గుకొచ్చిన సాంఘిక నాటకం మరొకటి కన్పించడం లేదు.

కథలో ఓ క్రొత్తదనం, ఓసమస్య, దాని పరిష్కారమార్గం, నాటకీయమైన మలుపులు మొదలైనవి కావాలని కోరుకొనే మేధావి వర్గం ఈనాటకాలంటే అభి మానం చూపిస్తున్నారు. వీరుకూడా నాటకం రెండుగంటలకంటే మించితే చూడ లేనిస్థితిలో ఉన్నారు. వీరు, అసహజమైన సంభాషణపద్ధతికి, సుదీర్ఘ రాగాలాపనకు విముఖులు. పాత్రలలోని సహజత్వం, మన స్తత్వ చిత్రణలోని నైశిత్యం, కథాకల్పన లోని చమత్కారం ఈసామాజికుల్ని ఎక్కువ ఆకర్షిస్తున్నవి.

ఈవిధంగా ఈనాటి నాటకసమాజాలూ సామాజికులూ స్థూలంగా పౌరాణిక సాంఘిక భేదాలచేతం రెండు తెగలుగా గోచరిస్తున్నారు. ఐనప్పటికీ, నాటకకళ యొక్క ప్రధానప్రయోజనం ఆనందదాయకత్వమే అని అంగీకరిస్తే, ఈ యిరు తెగలూ మళ్లా ఒకే గమ్యానికి చేరుకున్నట్లే.

•

—:0:—

# గోరిల్లా యుద్ధవిధానము

అనువాదకులు : శ్రీ సి. నరసింహాచార్యులు, ఎం. ఏ., ఎం. యిడి., బి. ఎల్.
మూల రచన : కీ. శే. డాక్టరు డి. యస్. రాజు (కల్నలు రాజు)
మాజీ కేంద్ర ఉపమంత్రి.

గోరిల్లా యుద్ధమునకే వెనుకపోటు యుద్ధమని వేరొక పేరు. ఇది నూతన సృష్టి కాదు. రెండవప్రపంచ యుద్ధకాలమునుండి యిది యొక శాస్త్రపద్ధతిని, కళా విధానమునను వృద్ధికావింపబడినది. కమ్యూనిష్టు చైనానాయకుడు మావో, దీని నత్యంతము పోషించి ప్రసిద్ధిలోనికి తెచ్చినవారిలో ప్రథముడు. మావో డెబ్బదికోట్ల చైనీయులకు విజేతయైన నాయకుడుగా పరిణమించుటకిదే ముఖ్యకారణము. సోషలిష్టు ఆర్థిక పరిస్థితులకు రాజకీయవిధానమునకు పట్టయిన చైనాలో ఈ యుద్ధవిధానమునే అవలంబించి వారి నాయకుడైన చియాంగ్ కైషేకును తన ప్రబలస్థానమునుండి, చైనాప సరిహద్దు ప్రాంతములలోనున్న 'ఫార్మోజా' యను ప్రాంతమునకు పారద్రోలుటలో విజేతయయ్యెను. ఆధునిక యుగమునందే దేశచరిత్రయందైనను నీ తేజోవంతమైన సాహసవిజయముతో సాటియైన సైనికచర్యవంటి సంఘటన వేరొకటిలేదు.

గోరిల్లా నైపుణ్యముతోడి యుద్ధతంత్రములు పూర్వకాలమున గూడ ప్రయోగింపబడెడివి. బహుశః ఈపద్ధతి ప్రథమదశలో, విదేశములలోని రహస్యములను సేకరించుటకు పంపబడిన గూఢచారుల రూపముననే యుండెడిది. రెండవప్రపంచ యుద్ధకాలమున జపానుసైనికులు తూర్పు ఆసియాపై పూర్తిగ ముట్టడింపకముందే, ఆనాటి బ్రిటిషువారి యనేక సంస్థలలో కొన్నివందల జపానీయులు, వివిధశాఖలలో నుద్యోగస్థులుగ పనిచేయుచుండెడివారు. వారు గూఢచారులుగ పనిచేసి రహస్యములను సేకరించి తమ మాతృదేశమునకు పంపుచుండెడివారు.

తరువాతి కాలమున నీపద్ధతికి ఎన్నో చిలవలు, పలవలు చేర్చి, ప్రయోగ విధానములను అభివృద్ధిగావించిరి. గోరిల్లా దళములు పారాచూట్సు సహాయమున శత్రు సైన్యముల వెనుకభాగమున విడువబడెడివి. వారు ఎంతటికష్టమునకైన ఓర్చుకొని, ధైర్యసాహసములతోను, మొండితనముతోను గూడి ప్రాణభీతి లేనివారినుండి ఏర్చి తీసినవారే. వీరికి గోరిల్లా యుద్ధవిధానమున తగు తరిఫీదు నిచ్చెడివారు. వారికి అన్ని వ్యూహములలోను యుద్ధతంత్రములలోను సంపూర్ణ శిక్షణ ఈయబడెడిది. వీరు ప్రారంభదశలో పరిపూర్ణమైన సామగ్రితోనున్న చిన్నదళములుగా నుండిరి. వీరికి వ్యక్తిగతముగాను, తమతమ కార్యనిర్వహణకు తగిన సరంజామాను గొనిపోవుటకును అవసరమగు హంగులన్నియు కల్పింపబడెడివి. వీరి ముఖ్యకార్యక్రమములలో, శత్రువుల రహదారులను నాశనముచేయుట, టెలిగ్రాఫు టెలిఫోను నిర్మాణములను ధ్వంసము చేయుట, మార్గమున వంతెనలను ఛిన్నాభిన్నములు చేయుట, ప్రధాన పారిశ్రామిక కేంద్రములను నేలమట్టము గావించుట, విద్యుత్ సరఫరాను, ఆయుధప్రయోగశాల

లను నిరుపయోగములు గావించుట, తక్కిన ఏర్పాట్లకు మట్టిపాలు చేయుట, అనునవియే ముఖ్యభాగములై యున్నవి.

దీనివలన ముందువైపునుండి వచ్చుచున్న తమసైనికులు త్వరితగతిని పురోగమించుటకు చక్కటి అవకాశము ఏర్పడును. ఎంతటి క్లిష్టమైన వాతావరణములోనైన పనిచేయు సామర్థ్యము వారికి గలదు. వీరు తాత్కాలికముగా నెట్టి పరికరములనైన నిర్మించుకొనగలరు. కొండలు, కోనలు, లోయలు వారి కెంతో రక్షణగా నుండునట్లు అవకాశములు కల్పించుకొనగలరు. ఆయా ప్రదేశములలోని ప్రజలతో సత్వరముగ స్నేహభావము నెలకొల్పుకొని, అనేకములగు చిక్కులకు లోనైన వారికి కష్టదశనుండి బంధవిముక్తి కలిగించుటకు తాము వచ్చినట్లు నమ్మకము పుట్టించగలరు. వారికి ఆయాసంఘములలో నున్న సాంఘిక మత రాజకీయ వైషమ్యములనుగూర్చి విపులముగ నేర్పి ఆయాపరిస్థితులలో మెలగవలసిన రీతిని తరిఫీదు చేసెదరు. వారి యుద్ధవిధానములో, శత్రువులను ఒక్కుమ్మడిని ముట్టడించి పారిపోవుటే ముఖ్యమైనది. వారు విజయము తథ్యమని నమ్మక మున్నపుడుతప్ప మరి యే పరిస్థితులలోను యుద్ధమునకు పూనుకొనరు. వారికి వలసిన వస్తువులన్నియు శత్రువులు జాగ్రత్తచేసికొన్న సామగ్రినుండియే గ్రహించుకోవలెను. దానికై ఆయాప్రదేశములలోని జనుల సహాయ సహకారములు సంపాదించుకోవలెను.

ప్రథమదశలో గొర్రిల్లాలు చిన్నచిన్న దళములుగా శత్రువుల వెనుకభాగములలో నెన్నోచోట్ల ఆక్రమించుకొనియుందురు. తమ కార్యక్రమములో విజయముసాధించిన కొలది విశాలప్రదేశములలో ప్రవేశింతురు. అప్పుడు క్రొత్తగొర్రిల్లా దళములు వీరిని కలిసికొనును. ఇట్లు క్రమక్రమముగా వీరొక పెద్దసైన్యముగా పెంపొందవచ్చును. అప్పుడు వారు శత్రువులను ముఖాముఖిగా ముట్టడింతురు. కమ్యూనిష్టు చైనాలో మావో తన దళములను కూర్చుకొని "యెనాన్" భాగమునకు ఉత్తరదిశగా తన సైన్యములను తీసికొని వెళ్ళినపుడు ఈవిధానమునే యవలంబించెను. అతడు క్రమముగా బలమును పుంజుకొని, తనకు కావలసిన యుద్ధసామగ్రిని తనశత్రువైన 'క్యుమింటాంగు' ప్రభుత్వమునుండియే సంగ్రహించగలిగెను. వ్యవసాయప్రదేశములైన పల్లెప్రదేశములు తన సైన్యపుపట్లుగా చేసికొనెను. క్రమముగా పట్టణములను వశపరచుకొనెను. ఇట్లు తుదివిజయమునకు సోపాన మేర్పరచుకొనెను. పూర్వకాలమున మన భరతఖండము లోనే దీనిని అన్నివిధముల పోలిన సంఘటన జరిగెను. మౌర్యచంద్రగుప్తుడును చాణక్యుడును తమ సైన్యములను సమకూర్చుకొని పాటలీపుత్ర రాజధానిని ముట్టడించిరి. నందచక్రవర్తి మహాసైన్యములు వీరిని సర్వనాశనము గావించెను. ఈ ఘోరపరాజయముచే వారు మగధరాజ్యమున పల్లెప్రదేశములకు పోయిరి. క్రమక్రమముగా జానపదుల నమ్మకమును సంపాదించుకొనిరి. పొరుగుదేశమువారితో స్నేహసంబంధములు నెలకొల్పుకొనిరి. అప్పుడు క్రమముగ సైన్యమును సేకరించుకొనసాగిరి. వారు పురోగ

మించుకొనుచున్న ప్రదేశములలోకూడ సైన్యమును పెంపొందించుకొనసాగిరి. సర్వము సిద్ధముచేసికొని రాజధానిని ముట్టడించి నంకుల నోడించి రాజ్యమునంతను గ్రహించిరి.

మావోకూడ, ఉత్తరదిశగా దూరదేశమున పులోగమించుచు, స్థానిక ప్రదేశములలో పరిస్థితులనుండి అవకాశములు కూర్చుకొనుచు, ఆయా ప్రజల భావిసౌభాగ్యములకు శక్తిమంతములైన కార్యక్రమములను బోధించుచు, ప్రజలందరను తన వశము గావించుకొనుచు, వారి దైన్యస్థితిని పోగొట్టుమార్గ ముపదేశించుచు అన్నిచోట్ల వారి స్వాగతమునే పొందగలిగెను. ఆల్జీరియా, ప్యూర్టోరికో, ఇండోచైనాలలోను, సైప్రస్ లోను ఆక్రమిత ఫ్రాన్సు, రష్యాభాగములందును గోరిల్లా యుద్ధతంత్రములు భిన్నములుగా నుండెను. ఆయాచోట్ల జరిగిన మార్పులు రాజకీయవిప్లవములు కావు. వాటిలో ముఖ్యముగా పరప్రభుత్వమునుండి ముక్తిపొందు కార్యక్రమమే యుండెను. ఈవిముక్తి సైనికదళములకు ప్రజాదరణ పూర్తిగా లభించెడిది. వీరు సర్వతోముఖముగ నభివృద్ధి చెందిన గోరిల్లా యుద్ధవిధానమును అవలంబించిరి. ఉదాహరణకు – ఆల్జీరియాలో, పది లక్షల ఫ్రెంచివలసవారు వ్యవసాయానుకూలమైన ప్రదేశమునంతను వశపరచుకొనిరి. కావుననే దేశభక్తితోను, జాతీయభావముతోను హఠాత్తుగా విరుచుకుపడెడి విప్లవ సూచనలు ఎప్పటికప్పుడే యుండెడివి. ఫ్రెంచి ప్రభుత్వము 45000 కు మించిన సైన్యమును ఏర్పాటుచేసి, గోరిల్లాలను అణచివేయుటకు విశ్వప్రయత్నము గావించినను, వారు యుద్ధమున పరాజితులైరి. తత్ఫలితముగా దేశీయులకు స్వాతంత్ర్య మొసగిరి.

'ఇండోచైనా' లో కూడ 'హోచిమిన్' కావించిన యుద్ధతంత్రము వ్యవసాయ ప్రదేశములైన పల్లెప్రదేశములలోనే ప్రారంభమయ్యెను. ఆప్రజలు వలసరాజ్యకాంక్షులైన ఫ్రెంచివారిచే నణగద్రొక్కబడియుండిరి. చైనాలోవలెనే, ఇచ్చటకూడ, వలసరాజ్యకాంక్ష గల పరాయిప్రభుత్వముచేత త్రొక్కబడి, ఆర్థికముగ ప్రజలు వెనుకబడియుండుటచే, ఆయవకాశమును తీసికొని నైపుణ్యముతో తానే సాహసోపేతుడై విప్లవకారుడైన సైనికోద్యోగియగుటచే, వారికి నాయకుడయ్యెను.

అతిధైర్యశాలియు, బలసంపన్నుడునైన సైన్యాధ్యక్షుడు గ్రీవస్ నాయకత్వమున సైప్రస్ దేశము బ్రిటిషువారి ప్రభుత్వమునుండి ముక్తిపొందుట వేరొక యుదాహరణ. అతని యుద్ధప్రక్రియ చాలవరకు గోరిల్లా యుద్ధవిధానమునే యనుసరించెను. తన అమూల్యమైన అనుభవజ్ఞానమును "సైన్యాధ్యక్షుడైన గ్రీవస్ గోరిల్లా యుద్ధవిధానము" అను పేరుగల గ్రంథమున పొందుపరచెను. ఈ యుద్ధమున నొకచిత్ర మేమన దేశభక్తులైన గోరిల్లా సైనికులు స్థానిక కమ్యూనిస్టువారి సహాయమును పూర్తిగ నిరాకరించిరి. స్వప్రయత్నముచేతనే, ధైర్యోత్సాహములతోను, తమ అజేయమైన సాహసముతోను, అకుంఠిత దీక్షతోను, తాము స్వల్పసంఖ్యాకులేయైనప్పటికిని తమ కృషిచే, 40000 మంది గల్గి పూర్తిగ యుద్ధపరికరములు చేకూర్చుకొనియున్న బ్రిటిషు మహాసైన్యమును, అలసటపాలుచేసి, వారి ధైర్యమును నశింపజేసి విజయము సాధించుకొనిరి.

రెండవ ప్రపంచయుద్ధమున జర్మనులు దురాక్రమణతో విజృంభించినపుడు ఫ్రాంసు, రష్యాదేశముల విముక్తి సైనికదళములు ఈ గోరిల్లాయుద్ధములోనే నూతన మార్గములను అవలంబించిరి. వారు ఈవిధానమును తమ దేశములోనే ఉపయోగింప వలసివచ్చినది. కావున వారి కెంతో అనుకూలపరిస్థితులు కలిగెను. తమ దేశీయుల పూర్తి సహాయసహకారములు వారికి లభించెను. సైనికు లందరును తరఫీదు పొందిన వారే. కావున వీరు గోరిల్లా యుద్ధవిధానమును అతిసులభముగ ఆచరణలో పెట్టగలిగిరి. ఈ విమోచనదళములకు విదేశ స్నేహరాజ్యముల మద్దతు, సహాయము చేయుటకు వాగ్దానము, నుండెను. దీనికితోడు, చొచ్చుకొని వచ్చుచున్న జర్మను సైనికుల దురంతములు ప్రజలకు భరింపరానివై పోయెను. కావున స్థానికప్రజలు తమ శక్తికొలది గోరిల్లాదళములకు సహాయ మిచ్చిరి.

జర్మనులు రష్యాపై దాడిచేసిన ప్రథమదశయందు, అసంఖ్యాకులైన రష్యను సైనికులు బేషరతుగా స్వల్పయుద్ధానంతరముననే జర్మనులకు లొంగిపోయిన విషయ మందరకు తెలిసినదే. దీనికి కారణ మేమన, రష్యనులు కమ్యూనిజముకన్న జర్మనుల నాజీప్రభుత్వ విధానమే మే లని మొదట విశ్వసించిరి. కాని త్వరలోనే జర్మనుల అతిఘోరమైన, భయంకర దుర్మార్గములను అనుభవించినమీదట, కమ్యూనిజము ఎంత చెడ్డదైనను, నాజీజముకంటె ఎన్నోరెట్లు మంచి దని గ్రహించుకొనిరి. ఈ భావమే గోరిల్లా సైనికులకు ఆత్మబలమును సమకూర్చెను. దీనివలననే రష్యనులు జర్మనులను త్రోసిపుచ్చగలిగిరి.

గోరిల్లా యుద్ధవిధానము మనదేశమున క్రొత్తకాదు. మన రాజపుత్రవీరులు గ్రీకులతోను, ఆఫ్ఘనులతోను, మొగలాయీలతోను నీవిధానమును సమరమున నుపయోగించిరి. కాని పూర్తిగ విఫలులైరి. రాజపుత్రులు తమ ధైర్యసాహసములమీదను ఆత్మశక్తిమీదను మాత్రమే ఆధారపడిరి. కాని యీపద్ధతి తమకన్న ఎన్నోరెట్లు సైనికబలము గలవారిపై ప్రయోజనకరము కాలేకపోయెను. మేవారుకు చెందిన రాణాప్రతాప్ అపజయములనుండి గుణపాఠము నేర్చికొని గోరిల్లా యుద్ధవిధానమును అవలంబించి మహాబలసంపన్నమైన అక్బరు సైన్యమును 15 సంవత్సరములకుపైగా నిరోధింపగలైను. తుట్టతుదకు మొగలుచక్రవర్తి విసిగి వేసారి రాణాప్రతాప్‌పై యుద్ధప్రయత్నములు, ముట్టడి, విరమించుకొనెను.

వేరొక యుదాహరణ. మన ఛత్రపతి శివాజీ, అతిస్వల్పసంఖ్యాకమైనను, ధైర్యస్థైర్యములుగలిగి దేశసేవ కర్పితమైన చిన్నబలగముతోనే ఔరంగజేబు అనంత సైన్యవాహినికి అడ్డుతగిలెను. శివాజీ నడిపించిన యుద్ధములన్నియు గోరిల్లాయుద్ధప్రక్రియపై నాధారపడినవే. అతడు విజయపరంపరనంది తన రాజ్యమును నిర్మించుకొనగలిగెను. శివాజీ మరణవార్తనువిన్నపుడు మొగలుచక్రవర్తి నిజమైన యుద్ధవీరునిగా శివాజీని ఎన్నోవిధముల స్తుతించెను. అతడు మహాసేనాధిపతు డనియు, తన మహా

బలసంపదకూడ నాతని లొంగదీయలేకపోయె ననియు వినమ్రతతో నొప్పుకొనెను. అందుచేతనే ఛత్రపతి శివాజీయు, మేవారు రాణాప్రతాపుడును మన దేశచరిత్రలో అమరవీరులై ప్రకాశించుచున్నారు. వీరిరువురు తమదేశమును పరాయిప్రభుత్వమునుండి ముక్తినొందించిరి. దేశభక్తిభావముతోనే ప్రజాకోటియంతయు తమ నాయకుని వెనుక నిలిచినది. వా రవలంబించిన విధానమంతయు గోరిల్లా యుద్ధవిధానమే.

కొలదికాలమునకు పూర్వము 1969 అక్టోబరులోనే టిబెట్ మధ్యప్రదేశములో జరగిన గోరిల్లా యుద్ధసంఘటన మన ప్రభుత్వమునకు తెలియవచ్చెను. సుమారు 300 దేశీయసైనికులైన గోరిల్లాలు, 30 మంది స్థానికులైన ఆటవికజనుల సహాయముతో చైనా వారి సహాయదళమును దోచుకొనిరి. వారు 800 యూనిఫారములను, 30 టన్నుల ఆహారపదార్థములను వేయి అశ్వములను, కంచరగాడిదలను తస్కరించుకొనిపోయిరి మావో సైనికులకు, విరోధులకు జరగినయుద్ధమే అనేక ప్రదేశములలో గోరిల్లాయుద్ధ విధానమును ప్రోత్సాహపరచెను. మావోకు, చైనాప్రభుత్వముక్రింద నలిగిపోవుచున్న స్వాతంత్ర్య ప్రియులైన ప్రజల సహాయము లభించెను.

ఇంతవరకు మనము తెలిసికొన్నదానిపై నాధారపడినవిజ్ఞానముతో, మనపొరుగు దేశములు గోరిల్లాయుద్ధప్రక్రియను మనపై ప్రయోగించునేమో పరిశీలింపవలసియున్నది వారి విజయావకాశములుకూడ మనము గ్రహించవలసియున్నది. ఈ గోరిల్లా యుద్ధము నకు అవకాశము, ప్రోత్సాహమును కలిగించు వాతావరణ ప్రదేశములు మన దేశమున సరిహద్దు రాష్ట్రములలో నెచ్చటనైన గలవా? (పశ్చిమబెంగాలు, కేరళరాష్ట్రములలో క్రమశిక్షణ పూర్తిగ నశించినది. శాంతిభద్రతలకు స్థానము పోయినది. వివిధపార్టీల సహాయముతో నేర్పడిన ప్రభుత్వములు నిలకడలేక కటకట బడుచున్నవి. పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి తన ప్రభుత్వమును నడిపించలేకపోవుచున్నానని బహిరంగ ముగ నొప్పుకొనెను. రాజకీయ హత్యలు, బందిపోటు దొంగతనములు, గృహదహన ములు చెలరేగి దినదినమునకు అదుపును తప్పిపోవుచున్నవి. ముఖ్యమంత్రికి, హోమ్ మంత్రికి, పొసగుటలేదు. పైగా నీరాష్ట్రము మనకును చైనాకును సరిహద్దు రాష్ట్రము ఇట్టి పరిస్థితులను పూర్తిగా అనువుగా గొనుటకు చైనా అప్రమత్తతతో నుండును దేశీయులలో విభిన్నత కలిగించి విమోచనదళము లనుపేరుతో, గోరిల్లా యుద్ధవిధాన మున దళములను కూర్చుటలో నెట్టి అవకాశమును వీడదు. వారు ఇప్పటి కప్పుడె శత్రుత్వము వహించు నాగానాయకులను, మిజోలను, ఇతర కొండజాతులను ఏర్పి వారికి తగిన తరిఫీదు నిచ్చినట్లు వార్తలు చేరినవి. వారికి వలయు అస్త్రసామగ్రిని వస్తుసరంజామాను సరఫరాచేసినట్లు తెలియుచున్నది. ఇట్టి కల్లోలములే కేరళ రాష్ట్ర మునకూడ జరుగుచున్నవి. సి. పి. (ఎమ్) ప్రభుత్వము కూలద్రోయబడినది. సి. పి. (ఐ) ఇతర రాజకీయపార్టీలతో ప్రభుత్వము నేర్పరచినది.)

చైనా, పాకిస్తానులు అవలంబించిన విరోధ విధానములవలన మన దేశీయులలో

మనలో మనకు స్నేహభావములు విడిపోవుచున్నవి. కాని దానివలన ఆ దేశముల కెట్టి లాభమును కలుగలేదు. విప్లవ కార్యక్రమములు క్రమక్రమముగా సన్నగిల్లుచున్నవి. మన రాష్ట్రప్రభుత్వములు, కేంద్రప్రభుత్వములు శాంతికై అనుసరించుచున్న వివిధ విధానములు గందరగోళములను పూర్తిగ పోగొట్టలేకపోయినను, అదుపులోనికి తెచ్చినవి. నాగాలాండు, మేఘాలయారాష్ట్రములు స్వయంప్రతిపత్తితో నేర్పాటు గావింపబడినవి. వారు వారి ప్రతినిధులను, మంత్రులను ఎన్నికద్వారా నిర్ణయించుకొందురు. ఈఏర్పాట్లవలన, వారివారికున్న రాజకీయతృష్ణలు తీరినట్లే భావించవచ్చును. ఇంకను చిన్నచిన్నలోపము లున్నచో వాటిని ఎన్నికలమూలముననుం, స్వయంప్రతిపత్తిగల న్యాయస్థానముల నేర్పరచియు సరిచేయవచ్చును. ఈ ఏర్పాట్లవలన శాంతిస్థిరము కావచ్చును. కలత లేర్పడిన చోట్లకూడ పురోభివృద్ధి గాంచనగును.

గతించిన 25 ఏండ్ల స్వాతంత్ర్యకాలమున ప్రజలు ప్రభుత్వవిధానమువలన లాభముల ననుభవించి యున్నారు. ఇట్టి స్వేచ్ఛకు మరెట్టివిధమైన ప్రభుత్వ విధానమును ప్రత్యామ్నాయముగ వా రంగీకరింపరు. ఇప్పటికే గోరిల్లాగణములకు, వినాశనకర ప్రయత్నధోరణులకు స్థానభ్రంశము కలిగినది. అవి యింక ఉత్సాహముతో మనుటకవకాశములు సన్నగిల్లినవి. ఎట్టి బలసంపదచేగాని, ఎట్టివిధానముచేగాని గోరిల్లా విధానము చాలకాలము మనజాలదు. అది జీవించవలెనంటే దేశప్రజ లందరు ఒక్కుమ్మడిగా లేచి మాతృదేశ రక్షణకు పూనుకొని నప్పుడే అప్రక్రియ చాలకాలను మనును. ఇట్టి విధానము లన్నియు తాత్కాలికములే. ఇవి అగ్రరాజ్యముల రాజకీయపు టెత్తులలో చిన్నపావులవలె మాత్రమేపనిచేయును. వీని ప్రయోజనము తీరినంతనే విసర్జించబడును.

ఏది ఎట్లున్నను – మన సరిహద్దు ప్రాంతములపై నిఘావేసి, ఏనురుపాటులేక, ఏక్షణమున నేమార్పు లుద్భవించుచున్నవో గమనించుట మనప్రభుత్వమునకు విధ్యుక్త ధర్మమైయున్నది. అచ్చటి పరిణామములను అణచివేయగల ప్రతిక్రియను చేయుటకు ఎల్లప్పుడు సంసిద్ధమై యుండవలెను. ప్రజాప్రభుత్వ విధానము వెలయు చున్న ఈ రాష్ట్రములలో, కలతలుగల్గించు నీ విధానములను అణచివైచి, ప్రజల సాంఘిక ఆర్థిక పరిస్థితులను మెరుగుపడునట్లు చేయవలెను. దీనితోపాటే ప్రజలలో నుత్తేజము కలిగించి ఏకీభావము కలిగించి హిందూదేశముతో నైక్యము చెందునట్లు చేయవలెను. మన మీకార్యమున విజయముపొందవలెనంటే మహాత్మాగాంధి సందేశమును ఎల్లెడల ప్రచారము గావించవలెను. మానవాళి సజీవమై మనవలెనంటే మహాత్ముని వచనమొకటే మార్గము. ఆమార్గ మొక్కటే ఏకైకశరణ్య మని ప్రపంచదేశములన్నియు నంగీకరించినవి. ఈకార్యక్రమమును మనము సక్రమముగ నిర్వహించిననాడు ప్రజానీకమునకు శాంతిసౌఖ్యములు చేకూర్చి మహాఫలితముల నందజేసినవార మగుదుము.

— ❀ —

## -* శు భా కాం క్షా సం దే శ ము లు *-

డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారు
డైరెక్టరు, అంతర్జాతీయ తెలుగుసంస్థ, హైదరాబాద్.

మీరు పంపిన సమాలోచన పత్రిక చేరింది. జాతీయతను సంప్రదాయవిశిష్టతనూ ప్రబోధించుతూ, సాహిత్య విమర్శను, అవగాహనను పెంపొందించుకోవాల్సిన అవసరం ప్రస్తుతం ఎంతేనా ఉంది. అందుకు తగిన పత్రికలు మనకు లేవనడం అతిశయోక్తి గాదు. మీ సమాలోచన నిజంగా ఆలోటును పూరిస్తోంది. మీ సాహిత్య సేవానిరతిని చాటుతోంది.

సరసమైన ధరలో విలువైన వ్యాసాలను అందిస్తున్న సమాలోచనను అభినందిస్తున్నాను. పేరుకుతగ్గట్టే లోన వస్తువుకూడా ఉండడం విశేషం. మౌలికంగా కొత్త ఆలోచనలకు మాత్రమే సిద్ధమౌతూ సంక్షిప్తంగా ఉన్నవ్యాసాలకు ఇతోధిక ప్రోత్సాహమిస్తే మేలని నా భావన. అప్పుడు పత్రిక అంతా ఒక చర్చావేదికకింద రూపొంది చరిత్రాత్మకమైన ప్రయోజనాలను సాధించగలదు. గెటప్ బాగుంది కాని ఇంకాస్త ఆకర్షణీయంగా ఉండవచ్చు. గెటప్ కంటె మించి దీని గౌరవం గుణాన్నిబట్టి సర్వత్ర అతిశయించాలని మనసార ఆశిస్తూ — మీ

పి. యస్. ఆర్. అప్పారావు.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, కావలి.

మీరు పంపిన సమాలోచన అందినది. ఇట్టి పత్రిక ఒకటి ఇప్పుడు చాల అవసరమనిపించుచున్నది.

శ్రీ జయంతి వెంకటశాస్త్రి, రాజమండ్రి.

కమనీయాకృతి కార్తికీవిమల రా
కాచంద్రి కామోద వా
క్సమ సంకల్పము సర్వపక్షములుగా
శోభిల్లి సాహిత్య రం
గమునన్ పొంకపుముద్ర వేసికొని లో
కఖ్యాతి న్నార్జించు గా
త! మనోజ్ఞం బఖిలాంధ్ర భూజనుల హృ
ద్వశ్రీ "సమాలోచనన్"

## *-* శుభాకాంక్షలు *-*

— తంగుడిగ శ్రీధరరావు, బి. ఎ., బి. ఇ. ఎల్

* అసమాన ప్రతిభావిశేషమున విద్యాదేవి నర్చించు మీ
దు 'సమాలోచన' సాహితీకుసుమ సందోహోచ్ఛ సౌరభ్యముల్
దెసలన్ నింపుచు తొంటి తెన్గువెలుగుల్ దీపింపగాజేయు న
ట్లు, సుమాళించెను కార్యరంగమున కాలున్ వెట్టి వహ్వా! యనన్

* మొన్న మొన్న నే గద జన్మముగొనె, నంత
లోనె మధురమంజుల వాక్ప్రసూన శోభ
లానె; కనులవిందుగ నడయాడ జొచ్చె
మంజుమంజీర శింజాన మహతి నొప్పి.

* మెచ్చరెవ్వరు ? దాని రూపును మేదినీజనమండలిన్
సచ్చరిత్రము నిండుగా నది సంతరించుచు నుండగా
నిచ్చలో మన తెన్గుబాసకు నిండు శోభల గూర్పఁగన్
వచ్చెపో! నవతేజ మొప్పుచు పక్షపత్రిక పేర్మిమై.

* రాజరాజ నరేంద్ర పాలన రాణకెక్కిన పీఠిమై
ఓజలొడుత నన్నయార్య మహోన్నతిన్ రహిపెంచ, వి
భ్రాజితాంధ్ర కళానికేతన రమ్యలీలల గుల్కుచున్
శ్రీజయంబులఁ బేర్మిఁ జల్లుచు చిన్మయంబై నిలిచెడిన్.

* శుక్లపక్షంపుఁ జందురు చొప్పునొంది
దినదిన ప్రవర్ధనమును గొనుచు దనరి
లోక కల్యాణపూర్ణ విలోకనమ్ము
బరపుచుం బదికాలాలు వరలుగాక !

—***—




## శతావధానప్రబంధము

[ రచయిత : శ్రీ సి. వి. సుబ్బన్న. xvi + 191 పుటలు. $\frac{1}{8}$ డెమ్మీ.
ప్రతులకు : శ్రీ రాయల సాహిత్య పరిషత్తు, ప్రొద్దుటూరు. ]

"ఆంధ్రకవితా కళైక నాళావలంబి
ఫలయుగం బైన తిర్పతీశ్వరులనుండి
కదలిపొంగిన అవధాన కవనమధువు
అష్టధా శతధా ప్రవాహముగ మారె" - మధునాపంతుల -

ఆ ప్రవాహము ఆంధ్రసాహిత్య రసజగత్తున కమృతప్రవాహము. కాలప్రవాహమున తరువాతతరువాత కొన్ని ప్రవాహములు తెలుగునేల నాలుగుచెరగులందు విందులు గూర్చినవి. అందు అవధాన కళాతపస్వి శ్రీ సి. వి. సుబ్బన్నగారి దొకటి. ఇది పద్య బంధముబాగున్న ప్రబంధము.

"శ్రీ సి. వి. సుబ్బన్నగారు అష్టావధానములు, శతావధానములు, చేయుటమానిన ఎంత బాగుండును?" అని అనిపించగల కావ్య కవితా రచనాసామర్థ్యముకల ఉత్తము కవి శ్రీ సి. వి. సుబ్బన్న.

కొందఱి పద్యకావ్యములలో ఎన్నియో అవధాన పద్యములవంటివి కన్పట్టును. కొందఱి అవధానపద్యములలో సమగ్ర కావ్యరచనాపాటవము ద్యోతకమగును. రెండవకోవకు చెందిన అగ్రగణ్యులు శ్రీ సి. వి. అని వీరు వ్రాసిన "శతావధాన ప్రబంధము" నిలచి చెప్పును.

వివిధ పట్టణ గ్రామములందు వీరొనర్చిన అష్టావధాన శతావధాన సందర్భ విరచితమైన ఆశుకవితాపద్యముల సమాహార మీగ్రంథము. ఆంగ్లసాహిత్యమున సంకలన గ్రంథములకు అత్యున్నతస్థానము గలదు. కాగా తెలుగున అట్టివాని అవసర మెంతేని గలదు. వానియెడల చిన్నచూపు తగదు.

ఈ శతావధాన ప్రబంధమును శ్రీ సుబ్బన్నగారి స్వీయకవితా సంకలన గ్రంథముగ, అవధాన సాహిత్య పుస్తక మాణిక్యముగ, చెప్పదగును. లొడలొడమను జల ధారల బోలు పద్యము లీ గ్రంథమందు కంచుకాగడాపెట్టి గాలించినను కనబడక పోవుట ఈకవి విశిష్టత. దానికి దృష్టరూప మిది.

"ఝరిణీతీర కుడుంగదేశమున ముస్తాఖాదనవ్యగ్ర ఘు
ర్ఘురరావ ప్రతిఘూర్ణితాఖిల దిశాక్రోడంబు వీక్షించి దు
ర్భర గర్జోద్ధతచపేటమై పయికిఁ బోవన్ ఘోణికాయ ప్రభా
కరి లంఘించి నిశాతదంతహతి నుద్ఘాటించె హర్యక్షమున్"

ఈ పైపద్యము శ్రీకృష్ణదేవరాయల కాలమున వ్రాయబడిన ఏదేని ఒక ప్రబంధములోని దనిపించును. కాని ఇది - "ఏనుగు సింహమును చీల్చివైచినట్లు" కవి 17-2-74 న వారణాశిలో చెప్పిన ఆశుపద్యము. శతావధాన ప్రబంధ పద్యము. పాకమున బడిన ఈయన వ్రాసిన ఇటువంటి పద్యములనుబట్టియే శ్రీ కరుణశ్రీ -

"అబ్బాయి చేతిలోపలి
కొబ్బరిముక్కలు మనోజ్ఞ కోమల కవితా
బిబ్బోకవతీ రుక్కులు
సుబ్బన్న శతావధాని సుందరవాక్కుల్" అనిరి. (12-11-72 లో)

అవధానములపై అవధాని అభిప్రాయము ఎటువంటిది ?

మ॥ అవధానమ్ములు నాశుపద్యరచనా వ్యాపారముల్ కీర్తి వై
భవ కాంక్షాకుజశాఖలున్ దళములున్ భావింపనే తన్మహా
వ్యవసాయమ్ము వృథాశ్రమాంతమొ ! జగద్భద్ర క్రియాకాంతమో !
శివ ! సర్వజ్ఞుడ వీవె తెల్పవలయున్ శ్రీ కాళహస్తీశ్వరా !
(30-3-1960 శ్రీకాళహస్తిలోని అష్టావధాన పద్యము)

ఈ శతావధాన ప్రబంధమువలన శ్రీ సుబ్బన్నగారిది ఫలితశ్రమ యనియు, వారి అవధానకళ భద్రక్రియాకాంత మనియు చెప్పవీలున్నది.

ఈ గ్రంథమునకు శ్రీ మధునాపంతులవారు వ్రాసిన 12 పుటల పీఠిక కావ్యకన్యకా కిరీట మనవచ్చును. అందు "మన పూర్వకవు లందఱు రసవత్పురాణ ప్రబంధకావ్యనిర్మాణములోఁ గృతావధానులు" అనుటయు; "అద్యతన కాలమున అవధానకళకు సుబ్బన్నగారు క్రొత్త ప్రొద్దుపొడుపు. ఈయన ఛందఃపరిచితి, వృత్త వైవిధ్యప్రీతి, లాక్షణికాభినందనీయములు. అవధానములలో తత్రతత్ర అసామాన్యములగు వృత్తములు ఈయన ఉపయోగించినవి యెన్నో ! స్వాగతము, అశ్వగతి, కవిరాజ విరాజితము, కవికంఠభూషణము, కాంతి, నర్కుటము. పంచచామరము, పద్మనాభము, ప్రియకాంత, మందాక్రాంత, మేఘవిస్ఫూర్జితము, స్రగ్ధర, సుగంధి. మంగళమహశ్రీ" మున్నగునవి అనుటయు; గ్రంథకర్త వైశిష్ట్యపాండిత్యములకు తార్కాణములు.

28-2-1971 వ తేదీని నెల్లూరు శతావధానమున పృచ్ఛకులలో నొకరు - "ఋతువు లాఱును నొక్కసారి వచ్చినచోఁ బ్రకృతి యెట్లుండును ?" చెప్పు మనగా ఈ చక్కని పద్యమును సరస్వతి పలికించినది.

చ॥ క్రమమునఁగాక యొక్కపరి గా సకలర్తు మహోదయమ్ము, ధా
త్రి మిఫుల నెండ హెచ్చుఁ జెలరేఁగెడు వానయు గాలి, మంచు రా
లు మఱియుఁ జెట్లుపూచుఁ బ్రిదులున్ దళముల్ వచియింప నేల ది
గ్భ్రమ ఘటియించు-బ్రహ్మ కలుఁద్రావెనొ యంచనిపించుఁ దప్పఁగా॥

నన్నెచోడుడు వ్రాసినాడేమో అనిపించగల చేవగల ఈపద్యము చక్కగా నున్నది.

అవధానమున ఈయన పెద్ద (న) తనమునకు 69వ పుటలో అల్లిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిని గూర్చిన మత్తేభమాలిక ఒక తారకాణ.

'ఖ' మున్నగు ప్రాసములతో అవధానములను చేసిన శ్రీ సుబ్బన్నగారి, పాండిత్యాశుధార జీవకవితా సామగ్రి గలది. ఈ గ్రంథస్థపద్యములు కవిహృదయ భాష్యములై వున్నవి.

దేశభాషాస్థితిని గూర్చి చీరాల అష్టావధానమున 15-2-1975 వ తేదీని ఈఆశు పద్యము జెప్పిరి.

"పలుకులపొందు వాక్యములపద్ధతి కాదని సుంత వేఱుగన్
బలికిన వ్రాసినన్ జనులు ఫక్కన నవ్వుదు రింగిలీసునన్ -
తెలుగున నేమిచేసినను దిట్టరు నవ్వరు దేశభాషకున్
విలువఁ దొలంగెఁ గక్కరితి విద్యలయేపుఁ జెలంగ భారతీ !"

దత్తపదు లెంత సామర్థ్యముగ నిర్వహింపగలరో తెలుపుట కొకటి. జ్యోతిలక్ష్మి, వరలక్ష్మి, వాణిశ్రీ, రాజశ్రీ - చలనచిత్ర నటీమణుల పేరులు వచ్చునట్లు భారత యుద్ధరంగమునుగూర్చి -

శా॥ ధీరోదాత్తుడు క్రీడి విల్లుగొన 'జ్యోతిర్లక్ష్మి' తీంద్రించె. వి
స్ఫారోద్య 'ద్వరలక్ష్మి' పుంఖముఖ భాస్వద్దేవతా శక్తియై
నీరంధ్రద్యుపథమ్మునన్ విబుధ 'వాణీశ్రీ' విజృంభించె ను
చ్చైరభ్యున్నతిఁ జేపడెన్ విజయ 'రాజశ్రీ' ముకుందాకృతిన్.

అని వ్రాయలేదు. ఆశువుగ చెప్పినారు.

తక్కువచేసి చెప్పుటకు ఎట్టి విధముగను వీలులేని ఈ శతావధాన ప్రబంధము తెలుగున గల సంకలనగ్రంథములలో పేరుమోసికొనగలది.

అవధాన వివిధాంశ సంబంధములైన 'మణిపూసల'వంటి పద్యములతో నిది అలరారి పద్యగ్రంథము లన ఒకరకమైన విసుపుగలవారిచేగూడ పఠింపజేసుకొనగల ఆత్మశక్తిగలది.

( తరువాయి 23 వ పేజీలో )

# మన్మథమథనము

( రచయిత శ్రీ శిష్ట్లా బాలకోటేశ్వరరావు, కాట్రావులపల్లి, పెద్దాపురం తాలూకా
వెల - మూడు రూపాయలు )

మన్మథమథనము సుమారు నూటఏబది పద్యముల కావ్యము. కాళిదాసకవి చంద్రుని సుమనోహరదర్శనముగల యొక మనోహరకావ్యతరంగము. మూలము కాళిదాసుని కుమారసంభవమే యైనను స్వతంత్రభావనలు, తాద్విశకల్పనలు కల స్వతంత్ర మనదగు ఖండకావ్యము. ఇందలి పద్యములన్నియు లలితసుకుమారపదబంధములై, రసవంతములై సత్కవితాలక్షణములతో ప్రాచీన కవితాధోరణిలో నడచినవి. ప్రాచీనుల పద్యములా యను భ్రాంతిని కలిగించునంత బాగుగ నున్నవి.

ఈఖండకావ్యము పది విభాగములుగా నున్నది. 'కథోద్ఘాతము'లో శ్రీ మధునాపంతులవా రన్నట్లు వీనిని 'దశ' లని చెప్పవచ్చును. మన్మథావస్థలలోని చివరిది (మరణము) మన్మథుని తుది యవస్థ యైనది. మన్మథుని మరణముచే నీకావ్యము దుఃఖాంతముగా నున్నట్లున్నను 'విశ్వకల్యాణసాధనకే విక్రమించి మరణ్మ మందిన రతిపతి మాన్యతముడు' అనుదానివలన విశ్వకల్యాణ మగు పార్వతీపరమేశ్వర కళ్యాణప్రయోజనము సూచితమగుటచే సుఖాంత మని చెప్పవచ్చును. విభాగములకు పేరులేకుండుట దీని నవీనతలలో నొకటి.

ఆద్యుండుమాసేవా అనునది (1 వ పద్యము) ఆద్యుండు ఉమాసేవా యనియు, ఆద్యుండు,మా సేవాయనియు శివవిష్ణు స్ఫోరకమై కవికిఁగల ప్రౌఢత్వమును వ్యక్తము చేయుచున్నది.ఇట్టిదే 3వ పద్యములోని 'యంచుమాజాని'.'ప్రజ్ఞాప్రతిష్ఠావచ్ఛ్రీయుత' వంటి సమాసములు కవికిఁ గల భాషాపాండిత్యమును, పదఘటనా చాతుర్యమును వెల్లడించుచున్నవి. ప్రథమవిభాగములోని 5, 6, 7, 8, పద్యములు కవికిగల ధారాశుద్ధిని, సులలితపదఘటనను, దీర్ఘసమాసములను గూడ ననాయాస మధురముగా కూర్చుటను, 38 పేజీలోని చక్కెరవింటిజోదు, అచ్చెరమచ్చెకంటులవిహారము, వంటి పద్యములు సమాసగుణరహితమైన పద బంధకౌశలమును సూచించును. సీసముల నిర్వహణ మిక్కిలి యుదాత్తమై ప్రాచీన కవుల పద్ధతిలో నిరాఘాటమై నడచినది, వర్షావర్ణన, శరద్వర్ణన (13, 14 పేజీలు) చక్కని రీతిలో సుమధురముగ నడచినవి. దశానదవీయసిన్ (24 పేజీ) వంటి ప్రౌఢప్రయోగములు, తెనుగుఛందస్సులో సంస్కృతశ్లోకరచన (20 పేజీ) కవిసామర్థ్యమును సూచించును. (హిమవంతుడు చేసిన శివస్తుతి) 22వ పేజీలోని 15 వ పద్యము. (అసమానకాయ) నిర్వహణ హృద్యమై మరవరానిదిగా నున్నది.

ఇందలి విభాగముల సారమును తారకపీడ, బ్రహ్మ సాంత్వనము, హిమాలయ గమనము - శివునితపస్సు, హిమాలయ స్వాగతము, ఇంద్రనియోగము, రతిమన్మథ సంవాదము, మన్మథుని శివసందర్శనము, పార్వతీ సాక్షాత్కారము, అస్త్ర ప్రయోగము, మన్మథమథనము (దాహము) అనురీతిగా విభజింపవచ్చును.

ఇందలి ప్రతిపద్యము పాఠకుల నాకర్షించు ననుటలో సందేహములేదు. పుస్తకమునారంభించి యాసాంతము చదివి యంతమున 'అయ్యో పుస్తకము పూర్తియైనదే! మరిన్నిపద్యము లుండిన బాగుండు నే?'యని పాఠకున కనిపించు నాకర్షణశక్తి యిందు పుష్కలముగ నున్నది. ఇది కవి, కవితారీతికి, యుక్తిచమత్కారమునకు కథానిర్వాహణకు నిదర్శనము.

తారకపీడితులగు దేవతలు బ్రహ్మలోకమున కరిగి, బ్రహ్మను స్తుతించి, బ్రహ్మచే చతురోక్తుల పరామృష్టులై; గీష్పతి వాక్కుల తమక్లేశముల నెరిగించి యాతనిచే నాశ్వాసితులైనట్లు కాళిదాస కుమారసంభవమున నుండగా వీరు (శ్రీబాలకోటీశ్వరరావు గారు) తారకక్లేశితులైన విబుధులు కర్తవ్య ముపదేశింప గీష్పతిని కోరగా నతడు తన యశక్తతఁ దెలిపి వారిని బ్రహ్మయొద్దకుఁ గొనిపోయినట్లు, అచట వారందరు బ్రహ్మను స్తుతించి తమ కష్టములను జెప్పికొనగా బ్రహ్మ "అకటా ! విషమార్గము లుప్పతిల్లె నేమనగల దింకవాడు ఖలు డార్జవ మొప్పదు నీతిబాహ్యులన్", అని పలికి, నేనేమి చేయుదును ? వాని తప మట్టిది, యిత్యాది వాక్యములచే తన యశక్తతను స్పష్టము చేయును. (మూలమున గీష్పతివివరణానంతరము "విషవృక్షోపి సంవర్ధ్య స్వయంఛేత్తు మసాంప్రతం" అని తన యశక్తత దెలిపి, పరమేశ్వరుని తేజ మందులకు దగినదనియు యుమ తద్వీర్యనిషేకభూమి యనియు పలుకును.) అప్పుడు బ్రహ్మ చింతను జూచి, గీష్పతి యల్ల నవ్వి 'కమలాసన ! యిం దనుచితమున్నదె చెపుడా' యిత్యాది వాక్యములచే బ్రహ్మకు దన వక్రోక్తివైభవము జూపును. అప్పుడు బ్రహ్మ లేనగ వణచుకొనుచు విహ్వలమతియై మృత్యుంజయుడో తదపత్యమోతప్ప మరొకరు వాని నిర్జింప లే రని పలికె నట. ఇట్టి కల్పనవలన కలిగిన ఫలమేమియో తెలియదు. గీష్పతి బ్రహ్మల పాత్రచిత్రణ మస్తవ్యస్తమై వికృతమై నట్లున్నది.

శివుడుతపశ్చర్యకై హిమాలయమున కరుదెంచి తపమాచరించుచుండగా; హిమవంతు డతనినర్చించి తత్సేవకై తనకుమార్తె (పార్వతి) నర్పించెను. శివుడందుల కంగీకరించెను. ఇది మూలములోనిది. ఈసందర్భమున శ్రీకవిగారు శివునితపమును, హేమంతమును, వర్ణించి; పిమ్మట తన వైభవమునకు దగినట్లుగా శివుని సమీపించి స్తుతించి విందొసగి శివునికృపావీక్షణమునంది 'ధన్యంబయ్యెను రాజ్యసీమలనఘా'యని (ఇటరాజ్యసీమలు ధన్యములయ్యెనని యుండఁదగునేమో?) మాకన్యార్థంబులు వేడనేల యని తనశ్లేషచాతురినిజూపి, తనకుమార్తెను సఖీసమేత సప్పగించి వెడలగా; భృంగి మొగ

మైత్రక యామె కొక యాశ్రమముజూపి, యిందువసింపు మనెనట! ఇట్టికల్పనవలన వీరు సాధింపదలచిన ప్రకర్ష యేమో సహృదయైకవేద్యము.

ఇంద్రుడు మన్మథుని స్మరింపగా నతడు వచ్చి తనప్రతాపమును కీర్తించుకొనుచు స్వామిభక్తిని వెల్లడించును. 'కుర్యాం హరస్యాపిపినాకపాణేః ధైర్యచ్యుతిం' అని తన సామర్థ్యమును జెప్పెను. ఇంద్రుడప్పుడు వానికి కార్య మెరింగించి, తనయా నతి శిరసావహించిన యాతని వీడ్కొలిపెను. మన్మథుడు మాధవునిచే రతిచే సాశం కాను ప్రయాతుడై అంగవ్యయప్రార్థియై స్థాణ్వాశ్రమమున కేగెను. కవిగారు- ఇంద్రుడు మన్మథుని రప్పింప దూతలనంప నాతడు బహురీతుల పరామర్శింపగా నింద్రు డాతనికి కార్యభారమును వివరించి 'ఈశునైన దృటిలో వేధించు' నని పలుకనపుడు కందర్పుడు కిందర్పుడై కంపించె నని కల్పించిరి. ఈ కల్పన యుత్కర్షావహముగ లేదు. మరియు నాసందర్భమున దర్పముసెడి ఆపడిన కందర్పుని ఇంద్రుడు అర్పిత కార్యము జెఱతువె? నేర్పరు లిట్లడల దగవె నేఱవె' యని ధైర్యము చెప్పెనట. కాళిదాస నిర్మితమగు మన్మథపాత్ర యిందు కాంతిహీన మైనది.

పరమేశ్వర తపోభంగమునకై మన్మథుఁడు వెడలిన సందర్భమున రతిచేసిన నివారణ, మన్మథుని ప్రత్యుక్తి, రెండును, శృంగార రసాధిదేవతలై యభిరూప దాంపత్య శోభితులగు రతిమన్మథులపాత్ర చిత్రణలో నపకర్షావహములై యున్నవి. కాళిదాసు చతురుడుగాన 'స మాధవే నాభిమతేన సఖ్యారత్యాచ సాశంకమనుప్రయాతః' యని మాత్ర మూరకొనెను. వీరు దానిని వివరించి యిట్టిస్థితికిఁ దెచ్చిరి.

గౌరి పరమేశ్వరునకు మందాకినీ పుష్కర బీజమాల నీయగా పరమేశ్వరు డంది కొనుచుండ మన్మథుడు సమ్మోహనాస్త్రమును సంధానించెను. తన్మాత్రముననే గౌరీ పరమేశ్వరులకు మనోవికార ముప్పతిల్లెను. శివు డింద్రియక్షోభము నణచికొని దిగంత ములఁ బరికించి మన్మథునిజూచుటయు నస్త్రముచే ప్రహరింపబోవు వానిని భ్రూభంగ మాత్రముననే నిటలాగ్నిచే భస్మావశేషునిఁ గావించుటయు జరగినది.

ఇచట కవిగారు మన్మథు డస్త్రప్రయోగము జేసినట్లుగా జెప్పిరి. ఇట్టి కల్ప నయు పరమేశ్వరుని పాత్ర నపకృష్ట మొనర్చుచున్నది.

కుమారసంభవములోని శృంగారము సామాన్యశృంగారము కాదు. దాని పరిశీల నకు సూక్ష్మదృష్టి యవసరము. కాళిదాసున కారహస్యము కరతలామలకము. కావున నేటికిని కుమారసంభవము నిత్యనూతనమై పలువుర కనుచికీర్షావహమై యున్నది.

ఇందు ముద్రారాక్షసములు బహువిరళములు. దీనికి గల మెరుగులలో నిది యొకటి. అభివాదించిన, హెచించె, పూర్వాసురలు, సతివియోగవ్యథ, మహాకాళి బస వులు. స్తుతిరుతులు, మెచ్చి నుతించెదనమ్మ భారతీ! రోచి, నవసుమాళఫు జెయుఁలు,

గురుదత్త గౌరవశీలకు, మహాదివ్యప్రీణన సజ్జితాస్త్రుని, వంటివి శ్రవణ మనో విచిత్రములై యున్నవి. మరియు మన్మథదాహమున రతికి అవమానభారమున దుఃఖము గల్గెనట. మన్మథనాశ మామె కవమానమును, తన్మూలకమగు దుఃఖమును కల్గించెనా? అట్టి యవమానదుఃఖము నోర్వజాలని రతి మౌనవంతురాలా?

మన్మథదాహమైన పిమ్మట మరిన్ని పద్యములలో మన్మథుని స్వామిభక్తినో దేవకార్యచికీర్షనో, విశ్వకల్యాణ శీలతనో వివరించిన బాగుండెడిది. దధిని మథించిన తరువాత నవనీత ముద్భవించినట్లు మన్మథుని మథనానంతరము విశ్వకళ్యాణ నవనీత ముదయించిన దని కవిగారి యభిప్రాయము కావచ్చును. చివరిపద్యము చివరి పాదమున 'మరణము' నుంచుటకంటె మథనము నుంచిన మరింత స్ఫూర్తిమంతముగా నుండెడిదేమో? గ్రంథనామము సముచితమై యున్నది.

ఇట్టివి కొన్ని యచటచట నున్నను గ్రంథము సుమనోమనోహరమై సత్కవితాచ్ఛాయలతో రమణీయముగా నున్న దనుటలో సందేహములేదు. ఇట్టి మధుర మనోహరకృతులను మరిన్నిటిని మనకు కవిగా రందింపగల రను సహృదయుల యాకాంక్ష వ్యర్థము కారాదు.

— శ్రీ ప్రసాద్.

---

( 19 వ పేజీ తరువాయి )

అవధాన మహాకళారాధకులు భవిష్యమునగూడ సృజింపబడుటకు ఏతదవధానములయెడ తెలుగులు అధికాసక్తి చూపవలసిన అవసర మున్నది. ప్రాచీనకళలపై ప్రభుత్వము కొంత ఆసక్తి కనబరచుచు హాని యభివృద్ధికి మార్గములు చూచున్లై ఈ కళ యభివృద్ధికి దారులు చూడవలెను.

తెలుగునాడున అవధానములు జరగినంత విరివిగా తత్సంబంధగ్రంథములు వచ్చివుండలేదు. నే డట్టివి రావలసిన అత్యవసరపరిస్థితిలో నిది వచ్చుట యుక్తమయినది కదా!

అవధాన పరిశోధకులలో ఒకరైన శ్రీ రాపాక ఏకాంబరాచార్యులవంటివారి గ్రంథములలో తగినవిధముగా నిది యుటంకింపదగినది. అవధానకవులలో వాయులీన విద్వాంసులుగాని విద్వాంసులు శ్రీ సుబ్బన్నగారు.

ఆంధ్రజను లెల్లరూ ఆదరింపదగిన ఈ గ్రంథము రచించిన కవి వివిధవర్ణముల స్వీయసాహిత్య ప్రకటనమూలమున ఆంధ్రసాహిత్యమునకు తగినసేవ చేయుటయేకాక సాహిత్య పరిశోధనమును చేయుట ప్రశంసనీయమైన విషయము!

— శ్రీ సన్నిధానం.

# ఈపక్షంలో

## వాస్తవికత - కొన్ని అభిప్రాయాలు

18-11-77 న పూనాలో అఖిలభారత మరాటీ సాహిత్యసమ్మేళనములో అధ్యక్షతవహిస్తూ పురుషోత్తమ భాస్కరభావే అను మరాటీ సాహిత్యవేత్త వాస్తవికత పేరుతో వెలువడుచున్న అనుచిత రచనావిధానాన్ని ఖండించారు. కళ పూర్తిగా వాస్తవికతకు అద్దంపట్టదు. వాస్తవాన్ని అవాస్తవంగాను సత్యాన్ని అసత్యంగాను సహజతను కృత్రిమంగాను చూపగలశక్తి కళకి కలదని ఆయన వక్కాణించారు. - ఆంధ్రప్రభ వార్త.

వాస్తవికతకి దూరంగా ఉండే రచనవల్ల చెరుపు కలుగుచున్నది. అని ఇటీవల ఒక సాంస్కృతిక సభలో ప్రఖ్యాత విమర్శకులు శ్రీ ఆర్. యస్. సుదర్శనంగారు ఉద్ఘాటించియున్నారు.

## తుపాను బీభత్సము.

19-11-67న కృష్ణా గుంటూరుజిల్లా కోస్తా ప్రాంతములో ప్రళయతాండవం కావించిన తుఫాను ఘోరాతిఘోరము. వేలసంఖ్యలో జరిగిన నష్టము పశుసంపద నష్టము ఊహాతీతము. అనేకవిధముల కష్టనష్టము లనుభవించి ప్రాణములతో నిలిచిన పీడితులకు సర్వవిధముల సాయపడవలసిన విధి ప్రతివ్యక్తిపైని, సంస్థలపైని, ప్రభుత్వములపైని, కలదు.

ఈవిషయంలో ఏమాత్రం జాప్యం జరిగినా, రాజకీయపు కక్షలతపు ఆలోచనలు మొలకెత్తినా అందుకు బాధ్యులైన వారెవరినీ జాతిక్షమింపదు. భగవంతుడు క్షమింపడు.

కేంద్ర రాష్ట్రప్రభుత్వములు సర్వవిధముల శ్రద్ధతీసికొన్నప్పటికీ అపాయము సంభవించిన పదిరోజులతర్వాతకూడ సంస్కారము జరగని మృతశరీరములతో అనేక ప్రాంతములు కుళ్ళిపోవుచున్నవను వార్త హృదయ విదారకము. ఇది ప్రజానీకము దోషమో ప్రభుత్వముల లోపమో మృతుల పాపమో భగవంతునికే యెఱుక.

— • —

# గ్రంథాలయ ప్రచారము

ఈనెల 14 నుండి 20 వఱకు జాతీయ గ్రంథాలయ వారోత్సవములు రాష్ట్రమున పెక్కుచోట్ల జరపబడినవి. గ్రంథాలయ ప్రచారమునకంటె భిన్నములైన సాంస్కృతిక కార్యక్రమములు (ఉపన్యాసములు, కవి సమ్మేళనములు, సన్మానములు, రూపక ప్రదర్శనములు మున్నగునవి) పెక్కులు నిర్వహింపబడినవి.

అర్ధశతాబ్దమునకు పూర్వము అల్పాల్పముగా నున్న గ్రంథాలయముల సంఖ్య గ్రంథాలయోద్యమ పితామహులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య ప్రభృతుల నిరంతర ప్రచార ప్రోత్సాహములచే బహుళముగా విస్తరించినది. గ్రంథాలయముల ఉపయోగము, విలువ, ఎల్లెడల గుర్తింపబడినది. ప్రభుత్వస్థాయిలోగూడ అన్నివిధముల సహకారము సమకూడుచున్నది. గ్రంథాలయ సంఖ్యతోపాటు గ్రంథముల సంఖ్య కూడ విస్తృతి చెందినది. ముద్రితమైన ప్రతి గ్రంథమును ప్రతి గ్రంథాలయము సేకరించి యుంచు ప్రయత్నమింకను విరివిగా సాగవలెను.

గ్రంథాలయముల సంఖ్యకంటెను, గ్రంథముల సంఖ్యకంటెను గ్రంథాలయ నిర్వహణ విధానము మేల్తరముగానుండు టత్యవసర మన్నది యెల్లరు గ్రహింపదగిన ముఖ్యాంశము. ఉన్న గ్రంథములలో నే పాఠకుఁ డేదియడిగినను వెంటనే లభ్యము కావలెను. గ్రంథము లన్నిటికి ప్రింటెడ్ కేటలాగు ఉండవలెను. ప్రతి ఐదుసంవత్సరములకు నూతన పుస్తకముల చేర్పుతో పునర్ముద్రణము నొందుచుండవలయును. కోరిన ప్రతి పాఠకునకు స్వల్పమూల్యముతో కేటలాగు సప్లయిచేయబడవలయును. ఏపుస్తకమయినను సర్క్యులేషనులోనుండి గ్రంథాలయమున హాజరులేనిచో నది యెన్నిరోజులనుండి యెవరియొద్దనున్నది, ఎపుడుతిరిగివచ్చునది తెలుపు కార్డుసిస్టము ప్రతి గ్రంథాలయమునను ఉండి తీరవలయును. పాఠకుల యభిరుచుల కనుగుణమైన విషయములు గల గ్రంథములను సూచింపగల విజ్ఞానవంతుఁడైన లైబ్రేరియను ఉండవలయును. పై విషయములలో నితోధికముగా తృప్తికరములైన పరిస్థితు లింకను నధికముగ నేర్పడవలసియున్నది. గ్రంథాలయ వారోత్సవములలో నిట్టియంశముల కెంత ప్రాముఖ్యము లభించినదియు గమనింపదగినది.

గ్రంథాలయ దైనందిన విధినిర్వహణమున నేవిధమైన రాజకీయలేశములకుఁ దావుండరాదు. ఇది యొక జ్ఞానమహాయజ్ఞముగా భావించి యెల్లరు గ్రంథాలయ వికాసమునకు దోడుపడిన దేశము విజ్ఞానవిలసితము కాగలదు.

— సంపాదకుడు.



# —* రచయితలకు మనవి *—



సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మకరచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూత నీయఁ బ్రార్థన. రచనలు సరళ గ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధ ప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండు కాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.



Registered No. H/Rmy-42.



అడ్రసు :—

సంపాదకుడు,

బులుసు సీతారామశాస్త్రి,

6-8-7, ఇన్నీసుపేట, రాజమండ్రి-1.

Edited and Published by B. Sitharama Sastry & Printed at B. V. & Co. Press, Innispet, Rajahmundry 1